# ఆకాశవాణి హైద్రాబాద్ కేంద్రం

## ప్రాంతీయ వార్తా విభాగం

## జాతీయ వార్తలు

తేది : 12.05.2015 సమయం : 0705 గంటలు

## ముఖ్యాంశాలు

1. నల్లధనం సమస్యపై బిజెపి నాయకుడు సుబ్రహ్మణ్యా స్వామి నివేదిక పై సుప్రీంకోర్టు ఈరోజు విచారణ జరుపుతుంది. ప్రత్యేక పరిశోధనా బృందం సిట్ (ఎస్.ఐ.టి.) కూడా తాజా పరిస్థితిపై ఒక నివేదికను దాఖలు చేసే అవకాశముంది.

2. భూసేకరణ బిల్లును ప్రభుత్వం ఈరోజు పార్లమెంట్ ఉభయ సభల సంయుక్త కమిటీకి పంపనుంది.

3. జాతీయ మానవహక్కుల కమీషన్ ఛైర్మన్‌గా దీర్ఘకాలం పనిచేసిన న్యాయమూర్తి కె.జి.బాలకృష్ణన్ పదవీకాలం నిన్న ముగిసింది.

4. ఐ.పి.ఎల్. క్రికెట్ పోటీల్లో భాగంగా సన్‌రైజర్స్ హైదరాబాద్ జట్టు కింగ్స్ ఎలెవన్ పంజాబ్ జట్టును 5 పరుగుల తేడాతో ఓడించింది.

   కాగా ఢిల్లీ డేర్ డెవిల్స్ జట్టు ఈరోజు రాయ్‌పూర్‌లో జరిగే మ్యాచ్‌లో చెన్నై సూపర్ కింగ్స్‌జట్టుతో తలపడుతుంది.

--------------

నల్లధనం సమస్యపై బిజెపి నాయకుడు సుబ్రహ్మణ్య స్వామి నివేదికపై సుప్రీంకోర్టు ఈరోజు విచారణ జరుపుతుంది. ప్రత్యేక పరిశోధనా బృందం సిట్ కూడా తాజా పరిస్థితిపై ఒక నివేదికను దాఖలుచేసే అవకాశముంది. ప్రధాన న్యాయమూర్తి హెచ్.ఎల్. దత్తు, న్యాయమూర్తులు అరుణ్‌మిశ్రా, అమితావ్‌రాయ్‌లతో కూడిన ధర్మాసనం ఈ అంశాన్ని ఈరోజు సాయంత్రం 4 గంటలకు చేపట్టనున్నట్లు నిన్న ప్రకటించింది. బిజెపి నాయకుడు తన నికవేదికలో నల్లధనాన్ని వెనక్కు తెచ్చేందుకు కొన్ని చర్యలను సూచించారు. అంతకు ముందు సుప్రీంకోర్టు నల్లధనంపై దర్యాప్తుపై తాజా పరిస్థితిని వివరిస్తూ ఈరోజులోగా నివేదిక దాఖలు చేయాలని సర్వోన్నత న్యాయస్థానం మాజీ న్యాయమూర్తి ఎం.బి.షా నాయకత్వంలోని సిట్‌ను ఆదేశించింది. దీనికి ముందు నల్లధనం సమస్యపై 2009లో ప్రజా ప్రయోజన వ్యాజ్యాన్ని దాఖలు చేసిన సీనియర్ న్యాయవాది రాంజేట్మలాని విదేశాలలోని బ్యాంకుల్లో అక్రమంగా దాచిన నల్లధనాన్ని వెనక్కి తెచ్చేందుకు చేసిన సూచనలను పరిగణించాలని కూడా సుప్రీంకోర్టు సిట్‌ను ఆదేశించింది.

---------------------

వెల్లడించని విదేశీ ఆదాయం, ఆస్తుల బిల్లు 2015ను లోక్‌సభ మూజువాణి ఓటుతో ఆమోదించింది. విదేశీ ఆదాయాన్ని వెల్లడించని వారిపై చట్టపరమైన చర్యలకోసం ఈ బిల్లును ఉద్దేశించారు. విదేశీ ఆదాయంపై చెల్లించవలసిన పన్నును ఎవరైనా ఉద్దేశ్యపూర్వకంగా చెల్లించకుండా ఉన్నట్లు ఋజువైతే వారికి మూడు నుంచి 10 సంవత్సరాల వరకూ కఠిన కారాగార శిక్షతోపాటు జరిమానా కూడా విధిస్తారు. భారతదేశంలో నివసిస్తూ తమ విదేశీ ఆస్తులనూ,ఆధాయాన్ని వెల్లడించని వ్యక్తులపై ఈ కొత్తచట్టాన్ని అమలు చేస్తారు. ఈ బిల్లుపై నిన్న లోక్‌సభలో జరిగిన చర్చకు కేంద్ర ఆర్థిక మంత్రి ఆరుణ్‌జైట్లీ సమాధానం చెబుతూ విదేశాల్లో నల్లధనం కలిగి ఉన్న వారిపై క్రిమినల్ చర్యలతోపాటు 120 శాతం పన్ను, జరిమానా విధించేందుకు ఈచట్టం ద్వారా అవకాశం ఉందని చెప్పారు.

-------------------

భూసేకరణ బిల్లును ప్రభుత్వం ఈరోజు పార్లమెంట్ ఉభయ సభల సంయుక్త కమిటీకి పంపనున్నారు. ఈ బిల్లు పరిశీలన కోసం 30 మంది సభ్యుల కమిటీని ఏర్పాటు చేయనున్నట్లు వార్తలందాయి. ఈ బిల్లు రైతు వ్యతిరేకమైనదని ప్రతిపక్షాలు పదేపదే అడ్డుపడుతూనే ఉ న్నాయి. దీంతో రాజ్యసభలో మైనారిటీలో ఉన్న అధికార పక్షం ఈ బిల్లు ఆమోదంపై

సందేహంతో ఉంది. గతవారం లోక్‌సభ ఆమోదం పొందిన వస్తుసేవా పన్ను బిల్లును కూడా రాజ్యసభ సెలెక్టు కమిటీకి పంపాలని ప్రభుత్వం యోచిస్తోంది. ఈ బిల్లును సెలెక్టు కమిటికి పంపాలని కాంగ్రెస్ పార్టీ పట్టుపడుతుండగా ఎ.ఐ.ఎ.డి.ఎం.కె. మాత్రమే ఈ బిల్లును వ్యతిరేకిస్తున్నట్లు ప్రకటించింది.

-----------------

జమ్ముకాశ్మీర్‌లో దక్షిణ కాశ్మీర్ అనంతనాగ్ జిల్లాలో శ్రీనగర్ – జమ్ము జాతీయ రహదారిపై ఒక గస్తీ బృందంపై గుర్తు తెలయని తీవ్రవాదులు చేసిన దాడిలో ఒక అధికారితో సహా ఇద్దరు సి.ఆర్.పి.ఎఫ్. సిబ్బంది హతులయ్యారు. శ్రీనగర్ నుంచి దాదాపు 40కిలోమీటర్ల దూరంలో హల్‌ముల్లా వద్ద రోడ్డును తెరిచే సి.ఆర్.పి.ఎఫ్. బృందంపై తీవ్రవాదులు మెరుపుదాడి చేసినట్లు అధికార వర్గాలు తెలిపాయి. మధ్యాహ్నం మూడు గంటల ప్రాంతంలో తీవ్రాదులు భారీగా కాల్పులు జరిపినట్లు వార్తలందాయి. తీవ్రంగా గాయపడిన ఇద్దరు సి.ఆర్.పి.ఎఫ్. సిబ్బంది అక్కడికక్కడే చనిపోయారు. చనిపోయిన సి.ఆర్.పి.ఎఫ్. సిబ్బంది ఒకరి నుంచి తీవ్రవాదులు సర్వీస్ రైఫిల్‌ను తీసుకుపోయారు. ఈ దాడికి తమదే బాధ్యత అని ఏ తీవ్రవాద సంస్థ ఇంతవరకు ప్రకటించలేదు.

----------------

ఢిల్లీ పోలీసు ప్రత్యేక విభాగం ఉత్తరప్రదేశ్ బహ్రెయిచ్ జిల్లాలో లష్కరేతోయిబాకు చెందిన ఒక కీలక కార్యకర్తలను అరెస్టు చేసింది. నిషిద్ధ ఇండియన్ ముజాయిదీన్‌కోసం కూడా ఆ కార్యకర్త పనిచేశాడు. గత 15 ఏళ్ళుగా తప్పించుకు తిరుగుతున్న 49 ఏళ్ళ ఇర్ఫాన్ అహ్మద్ ఎలియాన్ పప్పును గురువారంనాడు అరెస్టు చేసినట్లు ఢిల్లీ పోలీస్ సీనియర్ అధికారి ఒకరు నిన్న కొత్తఢిల్లీలో చెప్పారు. అనేక పేలుళ్ళ కేసులకు సంబంధించి ఇర్ఫాన్ అహ్మద్‌పై ఆరోపణలున్నాయి. భారతీయ యువకులను నియమించి వారికి ఆయుధాలు, మందుగుండు సామాగ్రి వాడకంలో ఐ.ఇ.డి.ల తయారీలో శిక్షణ ఇచ్చేందుకుగాను వారిని పాకిస్తాన్‌కు పంపే పనిని కూడా ఇర్ఫాన్‌కు అప్పగించారు. అంతకు మునుపు భారత్ వ్యాప్తంగా అనేక రైళ్ళలో వరుసగా పేలుళ్ళలో పాల్గొన్నాడన్నా ఆరోపణపై కూడా ఆరెస్టుయిన తీవ్రవాది జలీస్ అన్సారితోపాటు 1994 జరవరిలో సి.బి.ఐ. ఇర్ఫాన్‌ని కూడా అరెస్టు చేసింది. 2001లో బహ్రెయిచ్‌లో తన సోదరుని వివాహానికి హాజరయ్యేందుకు ఇర్ఫాన్‌కు పేరోల్ ఇచ్చారు. కాని అతను తప్పించుకుపోయాడు. అప్పటి నుంచి ఈ ఎల్.ఇ.టి. కార్యకర్త తప్పించుకు తిరుగుతున్నాడని ఆ అధికారి తెలిపారు.

----------------

జాతీయ మానవహక్కుల కమిషన్ ఛైర్మన్ అత్యధిక కాలం పనిచేసిన న్యాయమూర్తి కె.జి.బాలకృష్ణన్ పదవీకాలం నిన్న ముగిసింది. ఆయన స్థానంలో ఎవరిని నియమించాలనే దానిపై ప్రభుత్వం ఇంకా తుదినిర్ణయం తీసుకోవాల్సి ఉంది. ఎన్.హెచ్.ఆర్.సి. సభ్యుడు న్యాయమూర్తి సిరియాక్ జోసెఫ్ కొత్త ఛైర్మన్ నియామకం వరకు కమీషన్ ఛైర్మన్‌గా వ్యవహరించేందుకు రాష్ట్రపతి ప్రణబ్‌ముఖర్జీ అనుమతి ఇచ్చినట్లు ఒక అధికారిక ప్రకటన తెలిపింది. ఎన్.హెచ్.ఆర్.సి.కి ఆరవ, అత్యధిక కాలం ఛైర్మన్‌గా పనిచేసిన న్యాయమూర్తి బాలకృష్ణన్ తమ పదవీ కాలం ముగిశాక నిన్న భారత ప్రధాన న్యాయమూర్తిగా పదవీ విరమణ చేశారు. 2010, జూన్ 7వ తేదీన ఆయన కమీషన్ అధిపతిగా చేరారు.

----------------

ఆధాయానికి మించి ఆస్తుల కేసులో కన్నాటక హైకోర్టు నిర్దోషిగా తేల్చిన ఎ.ఐ.ఎ.డి.ఎం.కె. అధినేత జె.జయలలితకు ప్రధానమంత్రి నరేంద్రమోదీ శుభాకాంక్షలు తెలిపారు. మోది జయలలితతో మాట్లాడుతూ తమ శుభాకాంక్షలు తెలిపినట్లు ఎ.ఐ.ఎ.డి.ఎం.కె. ప్రకటన ఒకటి తెలిపింది. తనకు వ్యతిరేకంగా ఆదాయానికి మించిన ఆస్తుల కేసులో తమిళనాడు మాజీ ముఖ్యమంత్రి జె.జయలలితను కర్నాటక హైకోర్టు నిన్న నిర్దోషిగా తేల్చింది. తెలిసిన ఆమె ఆదాయ వనరుల కోసం బంధించి ఆమె కూడబెట్టిన ఆస్తుల శాతం కేవలం 8.12 శాతం ఎక్కువని ప్రాసిక్యుషన్ వాదించినట్లు ఎక్కువ కాదని న్యాయస్థానం నిర్ధారణకు వచ్చింది. ఆమె, మరో ముగ్గురు అప్పీళ్ళపై విచారణను పూర్తిచేసేందుకు సుప్రీంకోర్టు నిర్ణయించిన మూడు మాసాల గడువుకు కేవలం ఒక రోజు ముందుగా న్యాయమూర్తి సి.ఆర్. కుమారస్వామితో కూడిన ఏక సభ్య ధర్మాసనం తీర్పును ప్రకటించింది. ఈకేసులో శిక్ష పడ్డ జయలలిత, మరో ముగ్గురు దాఖలు చేసిన అప్పీలు పై ఈ తీర్పు వచ్చింది.

----------------

వాతావరణం

నైరుతి ఋతుపవనాలు వచ్చెనెల 10వ తేదీన ఒడిశా తీరాన్ని తాకే అవకాశముంది. భారత వాతావరణ శాఖ డైరెక్టర్ డా॥ శరత్ చంద్రసాహూ భువనేశ్వర్‌లో విలేకరులతో మాట్లాడుతూ ఈ నెల 25వ తేదీన తర్వాత మాత్రమే ఋతుపవనాల కదలిక స్పష్టమైన సమాచారం అందగలదని తెలిపారు. కాగా దక్షిణ ఒడిశా జిల్లాలో ఈనెల 14 నుంచి 17వ తేదీల మధ్య వర్షాలు పడే అవకాశం ఉందని చెప్పారు.

----------------

ఐ.పి.ఎల్. క్రికెట్‌లో సన్‌రైజర్స్ హైదరాబాద్ జట్టు కింగ్స్ ఎలెవన్ పంజాబ్‌జట్టును అయిదు పరుగుల తేడాతో ఓడించింది. హైదరాబాద్‌లో రాజీవ్‌గాంధీ అంతర్జాతీయ స్టేడియంలో గతరాత్రి 186 పరుగులను సాధించాల్సిన పంజాబ్ జట్టు నిర్ణీత 20 ఓవర్లలో 7 వికెట్ల నష్టానికి 180 పరుగులు మాత్రమే చేయగలిగింది. పంజాబ్‌ను విజయానికి చేరువ చేసేందుకు కేవలం 44 బంతులుతో 89 పరుగుల చేసి డేవిడ్ మిల్లర్ అవుట్ కాకుండా నిలిచారు. కానీ కేవలం అయిదు పరుగులు తక్కువయ్యాయి. అంతకుముందు, టాస్ గెలిచి ముందు బ్యాటింగ్ ఎంచుకున్న సన్‌రైజర్స్ 5 వికెట్ల నష్టానికి 185 పరుగులు చేసింది. కెప్టెన్‌గా డేవిడ్ వార్నర్ 52 బంతుల్లో 81 పరుగుల చేశారు. సన్‌రైజర్స్ తరఫున మెయిసెస్ హెన్రిక్స్ మూడు వికెట్లు తీసుకొని అత్యంత విజయవంతంమైన బౌలర్‌గా నిలిచారు. 12 మ్యాచ్‌ల నుండి 14 పాయింట్లతో సన్‌రైజర్స్ ఇప్పుడు పాయింట్ల పట్టికలో మూడవస్థానంలో వుంది. 12 బ్యాచ్‌లలో 15 పాయింట్లతో చెన్నై సూపర్ కింగ్స్ మొదటిస్థానంలో నిలవగా కోల్‌కతా నైట్‌రైడర్స్ 12 మ్యాచ్‌లతో 15 పాయింట్లతో ద్వితీయస్థానంలో నిలిచారు. ఈ రోజు రాత్రి 8గంటలకు రాయ్‌పూర్‌లో జరిగే మ్యాచ్‌లో ఢిల్లీ డేర్‌డెవిల్స్ – చెన్నై సూపర్ కింగ్స్‌తో తలపడతారు.

-------------------

అజ్ఞాతంలో వున్న దావూద్ ఇబ్రహీంను ప్రభుత్వం ఎలాగైనా భారత్‌కు తీసుకువస్తుందని కేంద్ర హోంమంత్రి రాజ్‌నాథ్‌సింగ్ చెప్పారు. ఆయన నిన్న ఈ విషయమై లోక్‌సభలో ఒక ప్రకటన చేస్తూ ముంబాయిలో 1993లో జరిగిన వరుస బాంబు పేలుళ్ళ కేసులలో దావుద్ ప్రధాన నిందితుడని పేర్కొన్నారు. దావూద్ ఇబ్రహిం పాకిస్తాన్‌లోనే ఉన్నట్లు ప్రభుత్వం వద్ద కచ్చితమైన సమాచారం ఉందని ఆయన అన్నారు. ధృవపత్రాలతోపాటు ఇతర ఆధారాలను పాకిస్తాన్‌కు సమర్పించినప్పటికీ దావూద్‌ను పట్టుకుని అతనిపై చట్టపరమైన చర్యలు తీసుకోవడంతో పాకిస్తాన్ విఫలమైందని హోంమంత్రి వివరించారు. కాగా దావూద్ ఇబ్రహీం పాకిస్తాన్‌లో వున్నాడన్న విషయాన్ని భారత్‌లో పాకిస్తాన్ హైకమీషనర్ అబ్దుల్ బాసిత్ ఖండించారు.

-------------------